Annual Subscription Rs. 2/-only. Reg. No. M. 2749.

A TELUGU MONTHLY JOURNAL OF INSURANCE BANKING AND FINANCE

# BHEEMA PATRICA

# భీమాపత్రిక

భీమా, బ్యాంకింగు, ఆర్థిక, వ్యవహారములను ప్రచారము చేయు మాసపత్రిక.

EDITOR:
S. KANAKARAJU PANTULU





VOL. V BEZWADA—SEPTEMBER 1936 No. 9

# భీమా పత్రిక

గౌరవపోషకులు

మ. రా. రా. శ్రీ. కె. బి. మాధవగారు, ఎం. ఏ, ఏ. ఐ. ఏ. (లండన్) ఎఫ్. ఆర్. ఎస్.

,, అయ్యదేవర కాళేశ్వరరావు పంతులుగారు, బి. యె., బి. యల్.

సంపాదకుడు: సూరంపూడి కనకరాజు పంతులు.

## భీమా పత్రిక

"భీమాపత్రిక" ప్రతిమాసమున కడపటివారములో ప్రకటింపబడును. జనవరి నెలతో సంవత్సరము ప్రారంభమై డిశంబరు నెలతో సంవత్సరాంతమగును. సంవత్సరములో నెప్పుడైన చేర్చుకొనబడిన చందాదారులు, వెనుకటి సంచిక లున్నయెడల ఆసంవత్సరములో వెనుకటి సంచికలనుగూడ పొందుట కర్హులు. సంవత్సరపు చందాలు విధిగా ముందు చెల్లింపబడవలెను. వ్యక్తులెప్పుడు చందాదారులుగ చేరి పత్రిక వి. పి. గా పంపుమని కోరెదరో ఆమాస పత్రిక మాత్రము వి. పి. గా పంపబడును. వి. పి. మొత్తము చేరినతరువాత లోగడ పత్రికలు బుక్కుపోష్టుద్వారా పంపబడును. పత్రికలలో ప్రచురింపబడవలసినవిషయము లన్నియు పత్రికాధిపతిగారికి పంపవలెను. మనియార్డర్లు, వ్యాపార సంబంధమైన విచారణలు మేనేజరుగారికి పంపవలెను. వ్యాసముల వాపసుగాని, ప్రత్యుత్తరములనుగాని కోరువారు పోస్టుచార్జీల నతికించి అడ్రసు వ్రాసిన కవరు పంపవలెను. వ్యాసకర్తలు, విలేఖరులు, ప్రచురణములకు పంపు విషయములలోని అభిప్రాయములకు సంపాదకులుగాని, ప్రకాశకులుగాని, ఉత్తరవాదులు కారు. సంవత్సర చందా రు 2—0—0. విడిపత్రిక రు 0—4—0.

వివరములకు:—మేనేజరు, భీమాపత్రిక, బెజవాడ.

### BUSINESS NOTICE.

The "Bheema Patrica" is published in the last week of every month. Subscribers who will not receive the Journal by the 15th of the succeeding month, will kindly communicate to the Manager.

The annual subscription is Rs. 2/- inclusive of postage. Single copy costs 4 annas Subscriptions at whichever time of the year be paid, will cover the period from January to December. All business communications should be addressed to the Manager. Contributions should be sent to the Editor. Articles on matters relating to Insurance are welcome. The Editor is not responsible for the views of the contributors.

For particulars:—The Manager, "Bheema Patrica" Bezwada (S. India).

ఇందులోగల ప్రకటనాదివిషయములకు వ్రాయునపుడు "భీమాపత్రిక" అనుపేరుదాహరింపవలసినదిగ కోరుచున్నాము.

అయ్యా!

శ్రీయుత........................................................................

గారి సలహా ననుసరించి మీకు యీ పత్రిక పంపించడమైనది. మీరు యీ పత్రికను సాదరాభిమానముతో స్వీకరించి చందాదారుగ చేరి సంవత్సర చందా రు 2/—రెండు రూపాయిలను మనియార్డరుద్వారా పంపించకోరుచున్నాము.

బెజవాడ, తేది 29—9—38.

మేనేజరు,
భీమా పత్రిక.




# *The Third Andhra Desa Indian Insurance Agents Conference*

## GUNTUR 1936.

The Third Andhra Desa Indian Insurance Agents Conference will take place at Guntur on 3rd and 4th October, 1936. Dr. Bhogaraju Pattabhi Seetha Ramayya Pantulu Garu, B. A., M. B. C. M., has kindly accepted to preside over the occasion. All the Andhra Desa Indian Insurance Agents are requested to attend the Conference.

—o—

# తృతీయ ఆంధ్రదేశ దేశీయ భీమాఏజంట్ల మహాసభ గుంటూరు.

1936 వ సంవత్సరము అక్టోబరు 3,4 తేదీలలో గుంటూరుపురమున సమావేశమగును. డా॥ భోగరాజు పట్టాభిసీతారామయ్య పంతులుగారు. బి. ఎ., యం. బి. సి. యం., అధ్యక్షతవహించెదరు. ఆంధ్రదేశమున గల దేశీయ భీమాకంపెనీల యేజంట్లందరును సదరు మహాసభకు హాజరుకాగలందులకు కోరుచున్నాము.

ఇట్లు,

ఆహ్వానసంఘము.

## I

# గుంటూరు సభలు

సెప్టెంబరు నెల 26,27వ, తేదీలలో గుంటూరు పట్టణములో జరుగ వలసిన తృతీయఆంధ్ర దేశ దేశీయ భీమా కంపెనీల ఏజంట్ల మహాసభ ముందునెల అక్టోబరు 3,4, తేదీలలో గుంటూరు పురమునందే జరుపుటకు తేదీలు మార్చబడెను. సదరు మహాసభకు శ్రీయుత డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్య పంతులుగారు, బి. ఏ., యం. బి. సి. యం., అద్యక్షతవహించెదరు. ఈ మహాసభలో ఏజంట్లకు ముఖ్య అవసరములగు అనేకములయిన ముఖ్యవిషయములు చర్చింపబడును. ఆంధ్ర దేశ వివిధప్రాంతముల నుండి ప్రతినిధులు వచ్చుచున్నట్లు తెలియుచున్నది. ప్రతినిధు లందరికిని తగు సౌకర్యములను చేయుటకు ఆహ్వానసంఘమువారు ప్రయత్నములను చేయుచున్నారు. ఆంధ్రదేశదేశీయ భీమాకంపెనీ ఏజంట్లందరును ఇట్టి తరుణమును పోగొట్టుకొనక ఈ మహాసభకు తప్పక విచ్చేసి జయప్రదముగా నడిపించెదరని నమ్ముచున్నాము.

## II

ఈ మహాసభ సమావేశమునకు ప్రతినిధులకు వసతులను, ఏర్పాటుచేయుటకు ప్రారంభములో గుంటూరు అరండేల్ పేటలో శ్రీయుత బాలిశెట్టి లక్ష్మీ నరశింహంపంతులుగారి సత్రములో చేయుదురని ప్రకటింపబడెను. అనివార్య కారణాంతరములచే అట్టి ఏర్పాటులకు వసతి కలుగనందున గుంటూరులో ఏషియన్ అస్యూరెన్సు కంపెనీవారి బ్రాంచిఆఫీసు ఆవరణములో అట్టి ఏర్పాటులను చేయుటకు ఆహ్వానసంఘము వారు స్థలమునుమార్చి ఏర్పాటులను చేయుచున్నారు. ప్రతినిధిఏజంట్లందరును ఈవిషయమును గమనించవలసినదిగా కోరుచున్నాము.

## III

# ఓరియంటల్ ఏజంట్లకాన్ఫరెన్సు

తృతీయ ఆంధ్రదేశ దేశీయ భీమాఏజంట్ల సమావేశసందర్భమును అవకాశము గైకొని అక్టోబరు 5 వ తేదీని గుంటూరుపురమున ఓరియంటల్ గవర్నమెంటు సెక్యూరిటీ లైఫ్ అస్యూరెన్సుకంపెనీ లిమిటెడ్ వారి ఏజంట్ల సంఘమును ఏర్పరచుటకుగాను తగిన సమాలోచన జరుపుటకుగాను గుంటూరుపురమున సదరు కంపెనీఏజంటు శ్రీయుత టి. వి. సుబ్బారావు గారు ఓరియంటల్ కంపెనీఏజంట్లందరిని సదరు సమావేశమునకు అహ్వానించి యున్నారు. ఆంధ్ర దేశములోఅన్ని దేశీయభీమాకంపెనీఏజంట్ల సమావేశమే గాక ఏకంపెనీ కాకంపెనీ ఏజంట్ల సమావేశములు సంఘములు వుండుట చాలా అత్యవసరము. ఈఅవకాశమును తీసుకొని ఆంధ్ర దేశములోగల ఓరియంటల్ కంపెనీఏజంట్లందరును సదరు సమావేశమునకు హాజరై చిరస్థాయిగ నుండునట్లు సదరుకంపెనీయొక్క ఏజంట్ల సంఘము నొకదానిని స్థాపించి తద్వారా ఏజెంట్లు తమకష్టసుఖములను ఎప్పటి కప్పుడుకంపెనీవారికి తెలియజేయుట అత్యుత్తమమైన విషయము. ఈ విధముగానే ఆంధ్రదేశములోగల అన్నికంపెనీ ఏజెంట్లునుఇదేవిధముగాసంఘములుగాఏర్పడితమ తమ అభిప్రాయములను కంపెనీవారికిని ప్రభుత్వము వారికిని ఎప్పటి కప్పుడు తెలియబరచినచో, కొన్ని కాకపోయినప్పటికీని కొన్ని అయినను సౌకర్యములు చేకూరకపోవు. గుంటూరుమహాసభకు చాలదేశీయ భీమాకంపెనీఏజెంట్లు సమావేశమగుదురు గనుక ఈయవకాశము దీసుకొని అచ్చటనే ఏకంపెనీఏజెంట్లు ఆ కంపెనీ ఏజెంట్ల సంఘములను స్థాపించుటకు ప్రథమసమావేశములను జరుపవలసినదిగా ప్రోత్సాహించుచున్నాము.

## IV

# రెండవ ఆంధ్రదేశ దేశీయ భీమా పట్టాదార్ల మహాసభ

1936 సం॥ అక్టోబరు 4 వ తేదీని గుంటూరు పురమున రెండవ ఆంధ్రదేశ దేశీయ భీమాపట్టాదార్ల మహాసభ సమావేశమగును శ్రీయుత వేమవరపు రామదాసు పంతులుగారు అధ్యక్షత వహించెదరు. ఒక్కొక్క భీమా పట్టాదారు తనకు కావలసిన సౌకర్యములను గూర్చి కంపెనీలవారికి తెలియపర్చినప్పుడు వారు వానిని విచారించుకొనక నిర్లక్ష్యభావముతో నుండుట అరుదు కాదు. ఒక పట్టాదారు తనకు కావలసిన సౌకర్యములను గూర్చి తానొంటరిగా కంపెనీలవారికి తెలియపరచుట కంటె సంఘీభావముతో పట్టాదార్లందరును ఒక్కచో సమావేశమై తమ అభిప్రాయములను, తమకు కావలసిన సౌకర్యములను ఏకగ్రీవముగా కంపెనీలవారికి తెలుపుట చాల ముఖ్యావసరము. కావున ఆంధ్రదేశములోగల దేశీయభీమా పట్టాదారులందరును యీ మహాసభకు విచ్చేసి తమ అభిప్రాయములను వెల్లడిచేసి కంపెనీలవారికి తెలియపరచుట తమ విధియని తలంచి యీమహాసభను జయప్రదముగా నడిపించెదరని నమ్ముచున్నాము.



# రెండవ ఆంధ్రదేశ దేశీయ భీమా పట్టాదార్ల మహాసభ

## గుంటూరు 1936.

1936 సం॥ అక్టోబరు 4 వ తారీకున గుంటూరు పురమున రెండవ ఆంధ్రదేశ దేశీయ భీమా పట్టాదార్ల మహాసభ సమావేశమగును. శ్రీయుత వేమవరపు రామదాసు పంతులుగారు అద్యక్షత వహించెదరు. కావున ఆంధ్రదేశమునందుగల దేశీయ భీమా పట్టాదారులందరును యీ మహాసభకు విచ్చేసి యీమహాసభను జయప్రదముగా నడిపింపగలందులకు గోరుచున్నాము.

ఇట్లు,

ఆ హ్వా న సం ఘ ము

# య ఆంధ్రదేశ దేశీయభీమా కంపెనీ ఏజంట్ల మహాసభ

(మల్లెల శ్రీరామమూర్తిగారు).

మనదేశంలో దేశీయభీమాకంపెనీల భీమా వ్యాపారం దినదినాభివృద్ధిగా జరుగుచున్నది. ఈఅభివృద్ధికి కారకులు సర్వవిధాలా ఆ యాకంపెనీల ఏజంట్లని, సగర్వంగా చెప్పగలుగుతాను. భీమాకంపెనీలఏజంట్లకు కష్టం చాలా ఎక్కువగాని, కష్టానికి తగినఫలితంమాత్రం శూన్యం. ఒక వ్యక్తిచే భీమాచేయించుటకు నప్పించి, ప్రపోజలుమీాద దస్కతు చేయించి, డాక్టరు పరీక్ష పూర్తిచేయించి, డబ్బుకట్టించే టప్పటికి పడేశ్రమ ఆ భగవంతునికే ఎఱుక. భీమాకంపెనీలవారు ఏజంట్లషరతుల్లో విధించిన విధించుచున్న వ్రాతలుపద్ధతి అతిఘోరముగాయున్నవి. ఎంతసేపటికి కంపెనీల అధికార్లు ఏజంటును గౌరవటానికే, అధికారం తమచేతులో ఉంచుకుంటున్నారు. వాటి నన్నిటిని ఎదుర్కొని కంపెనీలతో సక్రమంగా పరిష్కరించుకోటానికి ఏజంట్లు తమ కష్టసుఖాలను చెప్పుకోటానికి, ఏటేటా దేశీయ కంపెనీల ఏజంట్లందరు ఒకచోట సమావేశం కావడం చాలాఅవుసర మని గుర్తించి ఆంధ్రదేశ దేశీయభీమాకంపెనీ ఏజంట్ల మహాసభలు ఇదివరకు రెండు జరుపబడినవి. అందు మొదటి సభ 1932 సం॥ సెప్టెంబరు నెలలో బెజవాడలో ప్రొఫెసరు కె. బి. మాధవాగారి యాజమాన్యముననూ, రెండవమహాసభకూడ బెజవాడలోనే సుప్రసిద్ధభీమాశాస్త్రవేత్తలగు జి, ఎస్. మరాతే గారి యాధ్వర్యమున ౧౯౩౬ సం॥ ఆగష్టు నెలలోను, జరిగినవి. ఈ రెండు సభలు జయప్రదముగా జరుగుటకు భీమాపత్రికాధిపతు లగు శ్రీయుత సూరంపూడి కనకరాజుపంతులుగారి నిరంతరకృషి యని అందరెరింగినదే. ఈ విషయమై వారు వహించినశ్రద్ధ అత్యంతగణనీయమైనది. అంతియగాక కనకరాజుపంతులుగారు భీమాపత్రికద్వారా భీమాశాస్త్రమునుగురించి ఏజంట్లహక్కులనుగూర్చి చేయుచున్న ప్రచారము వర్ణింప నలవిగాదు.

ఏజంట్లరెండవమహాసభ వారి తీర్మానము ప్రకారము ఆంధ్రదేశ దేశీయభీమాకంపెనీ ఏజంట్ల సంఘమునకు నలయునిబంధనలు, ఉపసంఘము వారిచే తయారుచేయబడి, సాధారణసభ వారిచే ఆమోదింపబడినవి. త్వరలో ఈసంఘము చట్టప్రకారము రిజిస్టరుచేయబడనున్నది. ఇయ్యది చాల సంతోషదాయకము. దేశీయ భీమాకంపెనీల ఏజంట్లకష్టములనుపోగొట్టి న్యాయముగ ఏజంట్లకుండవలసినహక్కులను సంపాదించుటకొరకు ఈ నిరంతరము కృషిచేయవలసియున్నది. అట్లు జరుగవలెనన్న ప్రతి దేశీయభీమాకంపెనీ ఏజంటును ఈసంఘమున సభ్యుడుకావలసియున్నది. ఏజంట్లందరు యిందుసభ్యులై ఈసంఘముద్వారా హక్కులను సంపాదించుకొనుటకై ఏకోన్ముఖముగ పని చేయుటావశ్యకము. సోదర దేశీయభీమాకంపెనీల ఏజంట్లందరు ఈసంఘమున సభ్యులుగ జేరి సంఘమును బలపరచవలెనని కోరుచున్నాను. తృతీయ ఆంధ్ర దేశ దేశీయభీమాకంపెనీయేజంట్లమహాసభ ముందునెలలో అనగా అక్టోబరునెలలో గుంటూరు పురమునజరుపుటకు ఆహ్వానింపబడినది. ఆహ్వానసంఘ మేర్పడి ప్రయత్నములుచేయబడుచున్నవి. ఆంధ్రదేశ దేశీయ భీమాకంపెనీఏజెంట్ల సంఘ సభ్యుల సమావేశము మహాసభ సందర్భమున గుంటూరునజరుగగలదు. దేశీయభీమాకంపెనీల ఏజెంట్లందరూ ఈలోపున సంఘమునసభ్యులుగ జేరి, గుంటూరులోజరుగు తృతీయయేజెంట్లమహాసభకు ప్రతినిధులుగవిచ్చేసి, ఏజెంట్లకు కావలసిన సౌకర్యములను, హక్కులనుగూర్చి చర్చించు తీర్మానములలో పాల్గొని, మహాసభ జయప్రదముగాజరుగుటకు, ఆహ్వానసంఘమువారికి సర్వవిధముల తోడ్పడవలెనని సోదర ఏజెంట్లను ప్రార్థించుచూ విరమించుచున్నాను.

(సుబోధినీ-నెల్లూరు, 5-9-36).

# ఏజంట్లు - కమీషనులోనుండే తికమకలు

శ్రీ శనివారపు సుబ్బారావుగారు.

భీమాఏజన్సీ తీసుకొనినపుడు అందలి సాధక బాధకములు తెలియకుండానే తీసుకోవడం మామూలుగా యిప్పటివరకు జరుగుతూనే ఉంది. కంపెనీల వారు మొదటి సాలీనావాయిదా ప్రీమియంమీదను నూటికి 25 లగాయతు 75 వరకు ఏజంట్లకు కమీషనుయిచ్చుటకు సిద్ధపడుదురు. ఈ సిద్ధపడుటలో లక్షలవ్యాపారం చేసే వానికి 75 వరకు యిచ్చారంటే కంపెనీకి దండుగ లేదు. అలా గాకుండా ఏపాతికవేలో చేసిన వారికికూడా హెచ్చురేటు యిస్తామనిభ్రమపెట్టి అలా యియ్యడం జరుగుతోంది.ఇందులోని రహస్యాన్ని ఏజంట్లు గ్రహించకుండా వున్నందువల్లనే కంపెనీలకు లాభమును ఏజంట్లకు క్రమేణ దండుగయుకల్గుతోంది.కంపెనీల కాయాహెచ్చురేటుకు ఆశపడి పనిచేసే ఏజంట్లు ఏకొద్దియో వ్యాపారంచేసి వదలు కుంటారు. అందువల్ల కంపెనీఏజంట్లకు యిచ్చే రెన్యుయల్సు కంపెనీలకే మిగిలి లాభం కలుగుతుంది. ఏజంట్లు ఒక కంపెనీనుండి మరోకంపెనీకి ఆమొదటి ప్రీమియం మీద వచ్చే తాత్కాలికలాభమునకు ఆశపడిమారుతూవుండడంహెచ్చుగా యిప్పటివరకు అమలులోనే ఉంటోంది. ఏజెంట్లు అసలు యీ భీమావృత్తికి సిద్ధమైనపుడే యందలి సాధక బాధకాలు ఆలోచించుకొని మొదటి ప్రీమియముమీద వచ్చేకమీషను కొరకే ప్రాకులాడక రెన్యుయల్సు వంశపారంపర్యా వచ్చు ఏర్పాట్లకొరకే హెచ్చుశ్రద్ధను జూపాలి. ఆరీతిగ యేజెంట్లు పాటుబడనంతవరకు వారికి వృత్తివల్ల గిట్టుబాటుగాక కంపెనీలనే బాగుచేస్తున్నారని అనుకోండి. కంపెనీలను బాగుచేయడం అంటే భీమాపట్టాదార్లను కూడా కాదు. వాటాదార్లనే అని గ్రహించండి.

ఇందులకే యీ వృత్తిలో ప్రవేశించదలచిన వారంతా ఏజన్సీషరతులున్ను అందలి షరతులలో ముఖ్యంగా కమీషను (1) వంశపారంపర్యా వస్తుందో రాదో ఆ విషయమున్ను (2) కొంతకాలంచేసి మానుకొంటే రెన్యుయల్సు వచ్చు ఏర్పాట్లున్ను (3) కంపెనీకి ఏజంటుకు తగవు వస్తే మధ్యవర్తిపరిష్కారముకు వప్పుకునే షరతులు (4) కంపెనీ పరిపాలనలో ఏజంటుకుండే హక్కులు మున్నగునవి ప్రధానంగా జూచుకోవాలి. ఇట్టివేమి జూచుకోకుండా తొందరగా ఏజన్సీతీసికోవడం తరచు ఒక కంపెనీనుండి మరోకంపెనీకి మారుతూవుండడం జరిగించకుండానున్నపుడే ఏజంట్లను జూస్తే ఇటు కంపెనీలకు అటు ప్రజలకు గౌరవం వుంటుందని గ్రహింతురుగాక!

---

బ్రతికియుండేకాలము

| వయస్సు | 65 వత్సరాల వయస్సు, వరకు జీవించేవారు నూటికి— | 65 వత్సరాల వయస్సులోపున చనిపోవువారు నూటికి— |
|---|---|---|
| 25 | 56 | 44 |
| 30 | 58 | 42 |
| 35 | 61 | 39 |
| 40 | 63 | 37 |
| 45 | 67 | 33 |
| 50 | 71 | 29 |

పై అంకెలు అమెరికా దేశములోని జనాభాలో జీవిత పరిణామమునుబట్టి తేల్చిరి. మన హిందూదేశములో జీవించువారిలో పై అంకెలకన్న తక్కువయే యుండును.

---

# "నిజమే, నా కర్మం"

(ఆంజనేయశర్మ)

రామారావూ, నేనూ ఇద్దరం మంచిస్నేహితులం. రామారావు ప్రస్తుతం గుంటూరు ఆంధ్రా క్రిష్టియన్ కాలేజీలో ప్రొఫెసరు. జీతం రెండువందల రూపాయలు; మంచి తెలివిగలవాడు. అతనికి వెనకమాత్రం ఆస్తిపాస్తులు ఏమీలేవు. మొదట అతనికి తెనాలిదగ్గర పల్లెటూళ్లో పదియెకరాల మాగాణిభూమి ఉండేది. కాని, ఈయనగారి డిగ్రీకోసం అదంతా "సర్వశ్రేమాయమంగళం" చేసేశారు సుబ్బయ్యగారు. రామారావుకు వివాహమైంది. ఇప్పుడు ఒక ఆడపిల్ల; పిల్ల పేరు కమలం. చాలా అందంగాఉంటుంది. ఎఱ్ఱతోలు, గుండ్రని ముఖం, సోగకన్నులు. అన్నిటికంటె ఆపిల్ల మంచి తెలివిగలది. అందుచేత రామారావూ, అతనిభార్య ఇద్దరూ కూడా ఆపిల్లను మహా అల్లారుముద్దుగా పెంచుకుంటూ ఉండేవారు. ఆదంపతులకు ఈపిల్ల తప్ప ఇంకెవ్వరూ సంతానంలేదు. అసలే పిల్ల అందంగా ఉంటుందాయె. అందుమీద ఒక్కతే కూతురు. సరే ఇక పిల్ల ఏదికోరితే అదల్లా తెచ్చి పెట్టేవాళ్ళు. కొండమీదనుంచి కోతి కావలెనంటే మరుక్షణం సిద్ధం. పుట్టిన నాలుగో నెలకే నాలుగువందలకు ఆ అమ్మాయివంటిమీద బంగారం ఎక్కించినది వాళ్ళగుడ్డిప్రేమ అన్నప్రాశన అంటే ఐదారు వంద లారిపోయినయి. పట్టువితప్ప పరికిణీలు పనికిరావు. చేతులకుగాజు లంటారు. దుద్దు లంటారు- కాదు కాదు లోలకు లంటారు, వాళ్ళయిష్టం. మొత్తంమీద చెప్ప వచ్చేదేమి టంటే అతనికి వచ్చే రెండువందల్లో దమ్మిడీ మిగిలేది గాదు. పైపెచ్చు షరాబు కొట్లో కొద్దో గొప్పో అప్పు ఉండేది. రోజులు నిమిషాల్లాగా గడుస్తూవుండేవి.

కమలాని కిప్పుడు పన్నెండోఏడు. టౌన్ హైస్కూల్లో థర్డుఫారం చదువు తున్నది. ఆ పిల్ల ఏక్లాసులోఉన్నా క్లాసులో ఫస్టుగా ఉండేది ఉపాధ్యాయులందరికి ఆమె అంటే మంచిప్రేమ.

ఇక రామారావుభార్య సరస్వతికి కమలంపెళ్ళి జ్ఞాపకానికి వచ్చింది. ఏమంటే? 'పెళ్ళి' అన్నది. అప్పుడే కాలేజీకిపోయి వచ్చాడు రామారావు. 'ఏంపెళ్ళి' అన్నాడు. "కమలానికిఇప్పుడుపన్నెండో ఏడు. పెళ్ళిసంగతి ఏమిటి? సంబంధం, మంచీ, చెడ్డా అన్నీ విచారించరేం? ఇన్నిరోజులనుంచి చెపుదామనుకొని ఊరుకుంటున్నాను. మీకు జ్ఞాపకానికి వస్తుందేమోఅంటేలేదాయె. ఏమిటిసంగతి" అన్నది సరస్వతి. "ఏమిటికమలానికా? పెళ్ళి, మన కమలానికి" అన్నాడు. రామారావునెత్తిమీదపిడుగు పడింది. హృదయములోఉన్న రక్తప్రవాహం ఆగిన ట్లనిపించింది. తన కమలాన్ని పరాయింటివారి కిచ్చి అప్పజెప్పటమా ? తప్పే మున్నది ? కాసేపు పాతాళలోకంలోని పర్యటనం కాగానే, మామూలు మానవప్రపంచంలోనికి వచ్చాడు. సరస్వతి ముఖంవంక తదేకదృష్టితో చూస్తున్నది. "సరస్వతీ! జ్ఞాపకం చేశావు. నిజమే. మన కమలానికి మంచిసంబంధం వెతుకుతానులే. కాని ఒక్కప్రశ్న. మనము షరాబుకు ఇవ్వవలసినదెంత ? నాలుగువందలుకదూ ? బాగున్నది. మన దగ్గరఉన్న ఆస్తి అదేగా? షరాబు కొట్లో నాలుగువందల రూపాయలుబాకీ, మంచి ఆస్తే ! సరేకాని, కట్నంలేకుండా కమలాన్ని ఎవరు పెళ్ళి చేసుకుంటారు? అబ్బ! ఈదేశంలోనుంచి ఏనాడు

ఈ ప్రజ అంతరిస్తుందోగాని, రామ ! రామ ! ఎన్ని కుటుంబాలు నాశనమై పోతున్నాయి. సంఘానికి ఇదిఒక వేరుపురుగు. సంఘాన్ని కొరికి కొట్టివేసి గుల్లచేసివేస్తున్నది" అని ఉపన్యాసం ఆరంభించాడు రామారావు. సరేలెండి ఇవన్ని పూర్వపుసంగతులు. ప్రస్తుతం పిల్లకు వరుణ్ణి చూడండి. తర్వాత మీరూ నేనూ ఇద్దరం తీరికగా కూర్చొని ఆలోచిద్దాం" అన్నది సరస్వతి. భోజనం చేశాడు రామారావు. ఆ నాడు మొదలు వరుణ్ణి వెదకటానికి బ్రోకర్ల వ్యాపారంలోనే కాదు; పెళ్లి ప్రయత్నాలకు గూడా బయలుదేరారు పెళ్లికొడుక్కు ఇచ్చే కట్నాన్నిబట్టి కమీషను పుచ్చుకుంటారు పాపం. ఈబ్రోకర్లు మీకేదైనా సంబంధం కావలసి వుంటే, ఆ అయ్యల దగ్గరకు పోతేసరి, కట్నం ఆస్తి (ఉన్న దానికంటే రెండు రెట్లు ఎక్కువ చెపుతారులెండి) పోకర్లు, బంధువులు, వంశం అంతా కంఠోపాఠంగా వప్పచెప్తారు. సంధ్యావందనం బ్రహ్మయజ్ఞాల కంటె పెళ్ళిసంబంధాలు, పిల్లలు వ్యవహారం వాళ్ళకు బాగా తెలుసు. సరే, మన రావుకి గూడా దొరికాడు ఒక పేరయ్య. బయలుదేరాడు సంబంధం వెతకడానికి, ఒక నెల సెలవుపెట్టి కాలేజీకి.

చాలాచోట్ల తిరిగారు. విసిగి వేసారారు. కొన్నిచోట్ల పేరయ్యకు సరీగా కమీషన్ కుదరలేదు. కొన్నిచోట్ల రామారావుకు సంబంధం నచ్చలేదు. కొన్నిచోట్ల ఇరుగు పొరుగువారి ఇంట్రిడ్యూసులు ఎక్కువైనవి. పాపం అవి ఎంత గుండె నిబ్బరంగా పెట్టుకుందామన్నా రామారావును ఆపనిలో సఫలుణ్ణి కానిచ్చేవి కావు. ఎక్కడికి పోయినా, కట్నం మాత్రం ఆరువందలకు తగ్గలేదు. ఏమిటి కర్తవ్యం? మనవాడిదగ్గర ఉన్న ఆస్తి మీకు తెలుసుగా? నాలుగువందలు అప్పు. ఏమిటి గతి? పేరయ్య ధైర్యంచెప్పాడు. అంతకంతకూ దిగజారిపోతూ ఉన్న రామారావుకు మళ్లా కొంచెం ధైర్యం కలిగింది. మొత్తంమీద ఏలాగైతేనేం, ఏలూర్లో కుదిరింది సంబంధం. ఉప్పు ఏలూరే అని భయపడ్డాడు. కాని, పంపులసంగతి జ్ఞాపకం వచ్చింది, చూశాడుగూడాను. సంబంధం నిశ్చయమైనది. నాలుగు వేలు కట్నం. ఒక్కడే పిల్లవాడు. బి. ఏ. ఆనర్సు ప్యాసై కలకత్తాలో రీసెర్చి గూడా చేసి వచ్చాడు. యం. ఏ. కు ప్రైవేటుగాపోయి ఆ డిగ్రీగూడా సంపాదిస్తాడట. ఆస్తి, అదీ ఏదో ఉన్నది. పనరుపేటలో పెద్ద ఇల్లు ఉన్నది. ముందు అర్థంలేకుండా కట్టినమేడ గూడా ఉన్నది. ప్రస్తుతం వెంకటాద్రిపేటలో గూడా మేడ కడుతున్నాడు. అది చాలా బాగా కడుతున్నారు. తోళ్లషాపు ముందుకు తీస్తారట లెండి. వీరు ఆ ఇంట్లోకి కాపురానికి పోయేటప్పటికి సువాసన తగ్గుతుంది. ఇదీ వ్యవహారం. సంబంధం సెటిల్డ్ కట్నంకూడా సెటిల్డ్ ఇకఉన్నవి ఆడపడుచు లాంఛనాలు. ఆడపడుచులు పొడుచుకు తిన్నంత పనిచేస్తారు. ఇలాంటి సమయాల్లో ఆ వేవీ ఇవ్వలేనన్నాడు. ముందు ఏదో సామాన్యంగా చూస్తాములే అనుకున్నాడు. ఇంటికి చేరాడు రామారావు.

మాఘశుద్ధ విదియ సోమవారం పెళ్లి. పెళ్లి ప్రయత్నాలు జరుగుతున్నయి. నాలుగువేలో? పిత్రార్జితం ఇల్లొక్కటున్నది. దాన్ని బేరానికి పెట్టాడు రెండువేలు వచ్చినయి. భార్యా దగ్గర ఉన్న ఆభరణాలన్నీ అమ్మాడు, మిగిలిన ఆరెండు వేలు వచ్చినయి, పెళ్లిఖర్చు వెయ్యో? ఏలాగు ఆలోచించాడు. కోఆపరేటివ్ బ్యాంకులో అప్పు తీసుకున్నాడు. ఇతడుకూడా దానికి ఒక డైరెక్టరు లెండి. తొందరగా అప్పు శాంక్షన్ అయింది. కాని, వడ్డీమాత్రం సాధారణమైన ఆసామీదగ్గరే లేదు.

పేరు పంద్రెండం డణాలన్నర. వసూ లయ్యేటప్పటికి పేరుకు బేడ చొప్పున ముందు ప్రివేశ శుల్కం ఇచ్చే టప్పటికి మొత్తం అంతా తడసి మోపెడవు తుంది. సరే పెళ్ళిరోజు వచ్చింది. పెళ్లివారు దిగారు. తాము వచ్చినందుకు రైలుచార్జీగూడా పెట్టుకో మన్నారు. జనం తక్కువా? ఊళ్లో ఉన్న వంకాయ లమ్ముకొనేవాళ్లుగూడా హాజరయ్యారు పెళ్ళికి. పెళ్ళి పెద్దల్లాగా. అడుగులోనే హంసపాదు, రైలుచార్జీలు రెండువంద లవుతాయి, ఏదో విధంగా సమాధానం చెప్పాడు రామారావు పెళ్ళివారికి. పెళ్ళిజరిగింది. ఆడపడుచు లాంఛ నాలతో ఆహావరంగంలోకి దిగారు మగపెళ్లి వారు. నోరుమూసుకొన్నాడు రామారావు. చెంపలు వేసుకొన్నది సరస్వతి. పెళ్ళి పూర్తి అయింది. పెళ్లికొడుకు తనరిసెర్చి ప్రజ్ఞఅంతా చూపించాడు మామగారిదగ్గర, అత్తగారిదగ్గర. అల్లుడిప్రతిభకు ఇల్లుకాలినంతసంతోషంవచ్చింది మామగారికి. కడుపుచించుకుంటే కాలుమీద పడుతుంది. మాటాడలేదు పాపం మామ రామారావుగారు. మొత్తంమీద పెళ్లి అయింది గాని, ట్రాజెడీ—

గుంటూరు క్రిష్టియన్ కాలేజీలో విచిత్రమైన విషయం ఒకటి ఉన్నది. అదేమి టంటారా? ఏ ప్రొఫెసరులైనా ఆకాలేజీలో స్థానం క్రిష్టియను ప్రొఫెసరు దొరకనంత సేపుమాత్రమే. మొన్న ఒక్కస్టూడెంటు కనపడి తెలుగు ప్రొఫెసర్ల సంగతి చెపితే, భలే నవ్వొచ్చింది నాకు. సరే, ఇవి రామారావుకు స్టార్ చమక్ నే వాలే రోజులు. ఎవరో క్రిష్టియన్ వచ్చాడు. ఉద్యోగంఊడి ఎగిరి మూడుమైళ్ల దూరంలో పెళ్ళిపడిపోయింది. ఏమిటి కమలంసంగతి? ఏమిటి తనసంగతి? "కన్యాదానంతో భూములన్నీ క్షువరమైతే భిక్షానికే బయలుదేరుతాం' అయింది వ్యవహారం. పాపం చాలా దిగులు పడ్డాడు. ఏమోయి శర్మా! ఏమిటి నా గతి? అన్నాడు. "ఏమిటోయిరామం?" అన్నాను. 'కష్టసుఖాలు కావడికుండలు గదా!' నిన్న, మొన్న వరకు అతులితమైన భోగభాగ్యాలతో ఆనంద మనుభవిస్తూ ఉన్న నేను ఇవాళ బూడిద పూసుకొనే బుక్కాఫకీరు నయిపోయినాను. ఉద్యోగం ఉండేది. చేతిలోనికి పుష్కలంగా డబ్బు వచ్చేది. సర్వవిధాలైన జీవితానందాల్నీ అనుభవిస్తూ ఉండేవాళ్ళం, పోనీ, నేనేదో 'సీతారామాభ్యాం నమః' అని చెంబుతోముకొని బయలుదేరినా ఇంత ఖర్చుపడి చేసిన కమల సంబంధం గూడా ఆలాగా తయారయింది. ఇలా నీచస్థితిని అనుభవించి, పిల్లపెళ్ళితో పూటకూటికి గతి లేకుండా పోతానని కలలోనైనా అనుకో లేదు సుమా! ఇదంతా కర్మసిద్ధాంతవిషయికమైనది గదా అన్నాడు. నాకూ, ఒక్కసారిగా విషాదము ఆశ్చర్యము, నవ్వు, కోపము అన్నీ వచ్చేసినయి. "రామం! ఏమిటీ? ఏమిటి అన్నావు? నాయనా! ఆడపిల్లను కన్నావని ఎరుగవూ? ఆపిల్లకు పెళ్ళి చేయవలెనని ఎరుగవూ? దానికికట్నాలు కావలెననిఎరుగవూ? ఈరాక్షసాచారము కొటుంబాల్ని నాశనంచేసి పీల్చి పిప్పిచేస్తుందని ఎరుగవూ? ఏమి యెరుగవూ? అన్నీఎరుగుదువు. ఆడపిల్లను కన్నాననీ ఎరుగుదువు, కట్నాలున్నయ్యనీ ఎరుగుదువు కాని కన్నులుండే అంధుడవయినావు. నీలోఆలోచనాశక్తిసున్న అయినది. అంధకారమయమైన భవిష్యత్తులో కొండలంతేసి ఆపద లొస్తాయని మరచిపోయావు. ఆరెండువందల మజాలో ఆసొమ్ముల తళతళల్లో, ఆకూతురుకు ఆసొమ్ము కావాలి, ఈసొమ్ముకావాలి అనే ముద్దుముద్దుల ఆకాంక్షల్లో, ఆప్రేమరూపిణియై, సుఖకరంగా మాట్లాడుతూ, ఆడజాతికి అలంకారప్రాయమైన

ఆ బీదతనంతో చూపిన భార్య సత్యమైన అనురాగానికి అరువిచ్చినవర్తకుడిదగ్గర అరువుదారు వయిపోయినావు. తప్పేదేమున్నది ? నిజంగా ప్రజలకు ఈలాంటి సంసారములపాలిటి కామధేనువులవలె పనిచేస్తూ వున్న ఏ ఇన్సూరెన్సు కంపెనీలోనో పిల్ల పుట్టినతోటేనాలుగైదు వేలకు వివాహ భీమాచేస్తే ఎంత బాగుండేది! ఆసొమ్మువివాహానికి అక్కరకు వచ్చేది. ఆఇల్లూ, అవి మిగిలేవి. ఏదో నీపొట్ట నీవు పోసుకొనేవాడివి. కాని మించింది. ఏమిలాభం" అన్నాను. "నిజమే నాకర్మం అయిపోయింది" అని ఒక నిట్టూర్పు విడిచాడు రామారావు.

— (ఆపద్బంధు)

## భీమా శాస్త్రంమీద పుస్తకాలు

(1936 మార్చి సంచిక తరువాయి)

### THE LAW RELATING TO INSURANCE

58 Agents and Brokers By J. B wilson — Rs 4—0—0

59 Thrift By Samuel Smiles — Rs 1—8—0

60 Corresponding Saving of time — Rs 0—12—0

61 Problems of Insurance Inspector — Rs 2—4—0

ఈ పైపుస్తకాలలో 58, 59 నెంబర్లపుస్తకాలు తప్పక ప్రతిభీమాఏజంటు చదవడం మంచి దని గ్రహింతురుగాక.

శ॥ సుబ్బారావు

# ఆంధ్ర దేశదేశీయ భీమాకంపెనీ ఏజంట్ల తృతీయ మహాసభ, గుంటూరు.

# ఆహ్వాన సంఘమువారి ప్రకటన.

ఆంధ్రదేశదేశీయ భీమాకంపెనీ ఏజంట్ల తృతీయ మహాసభ ఆహ్వానసంఘమువారి తరఫున యీదిగువ విషయములను ప్రకటించుచున్నాము.

1. ఆంధ్ర దేశ దేశీయ భీమాకంపెనీ ఏజంట్ల తృతీయ మహాసభ 1936 సం॥ అక్టోబరు 3, 4 తేదీలలో గుంటూరు పట్టణమున జరుపుటకు నిశ్చయమైనది.

2. ప్రసిద్ధిజెందిన కాంగ్రెసు నాయకులగు శ్రీయుత డాక్టరు భోగరాజు పట్టాభిసీతా రామయ్యాపంతులు, బి. ఎ., యం. బి. సి. యం., గారు మహాసభకు అధ్యక్షత వహించెదరు.

3. మహాసభ సందర్భమున జరుగు భీమాప్రచారకసభలో భీమావ్యాపారము, భీమావిద్య, భీమాప్రచారము, ఏజంట్లపరిస్థితులనుగూర్చి వ్యాసములను చదువదలచినవారు అట్టి వ్యాసములను, మహాసభలో అంగీకరించుటకు తీర్మానములను పెట్టదలచుకొనినవారు అట్టి తీర్మానములను సెప్టెంబరు నెల 25 (ఇరువదియైదు) తేదీలోపల యీదిగువ వుదహరించిన వారికి పంపగోరుచున్నాము.

4. ఆంధ్రదేశములో పనిచేయుచున్న దేశీయ భీమా కంపెనీ ఏజంట్లును చీఫ్ఏజంట్లును ప్రతినిధులుగాను, ఆహ్వాన సంఘసభ్యులుగాను నుండవచ్చును.

5. ఆహ్వానసంఘసభ్యత్వపు రుసుము రు 5/- (అయిదు) లును, ప్రతినిధిరుసుము రు 2/- (రెండు) లును, ఏర్పాటు చేసియున్నారు.

6. రు 2/- (రెండు) లు చెల్లించి ప్రతినిధులుగా చేరిన భీమాఏజంట్లను, రు 5/- (అయిదు) రూపాయలు చెల్లించి ఆహ్వాన సంఘసభ్యులుగా చేరిన భీమా ఏజంట్లును, చీఫ్ఏజంట్లును మాత్రమే మహాసభచర్చలయందు పాల్గొని వోటుచేయుటకు హక్కుకలిగి యుందురు.

7. మహాసభకు విచ్చేయు ఆహ్వాన సంఘసభ్యులకును, ప్రతినిధులకును, భోజనవసతుల విషయములో తగు సౌకర్యములు చేయుటకు ఆహ్వాన సంఘమువారు, గుంటూరు అరండేల్

పేటలో శ్రీయుత దేశరాజు హనుమంతరావు పంతులుగారియింటిసమీపములో నున్న శ్రీ బాలేమర్తి లక్ష్మీనరసింహంపంతులుగారి సత్రములో, ఏర్పాటులను చేయుచున్నారు. ఉనికి, భోజనవసతులకు ప్రత్యేకించి రుసుములనేమియు చెల్లింప నక్కరలేదు.

8. ఈమహాసభకు సంబంధించిన ఉత్తర ప్రత్యుత్తరములును, మనియార్డర్లు చెక్కులు వగైరాలును, యీమహాసభ జనరల్ ఆర్గనైజరుగా నైన యీదిగువవారికి పంపవలెను.

Address:—S. KANAKA RAJU PANTULU, Esq,
Editor, Bheema Patrica, Bezwada. (S. India).

9. రాబోవుమహాసభలో భీమా ఏజంట్లకు సంబంధించిన చాలా ముఖ్యవిషయములు చర్చింపబడును గాన ఆంధ్రదేశములో పనిచేయుచున్న దేశీయ భీమాకంపెనీ ఏజంట్లందరును ప్రతినిధులుగను ఆహ్వాన సంఘసభ్యులుగను చేరి యీమహాసభకు విచ్చేసి మహాసభచర్యలయందు పాల్గొని మహాసభను దిగ్విజయముగ నడిపింపగలందులకు ఆహ్వాన సంఘమువారు కోరుచున్నారు.

10. భీమా ఏజంట్లందరును తమతమ ఆహ్వాన సంఘ సభ్యత్వపురుసుమును ప్రతినిధిరుసుమును సెప్టెంబరు నెల 25 వ తేదీలోపల పైనవ్రాసిన అడ్రసువారికి చేరులాగున పంపవలెను.

11. పైన ఉదహరించిన ప్రకారము సెప్టెంబరు నెల 25 తేదీలోపల ప్రతినిధిఆహ్వాన సంఘసభ్యత్వపురుసుములు పంపి, యితర గ్రామములనుండి వచ్చు ఆహ్వాన సంఘసభ్యులును, ప్రతినిధులును, ఎవరెవరు, ఎప్పుడు, ఏరైలు బండీలోవచ్చెదరో ముందుగా తెలియపర్చవలసినదిగా కోరుచున్నారు. అట్లు ఆహ్వాన సంఘసభ్యత్వపు ప్రతినిధి సభ్యత్వపు, రుసుములను పంపి ముందుగా ఆహ్వాన సంఘమువారికి తెలియ పర్చనిదే ప్రతినిధులను రైళ్ళవద్దకలసి తగు ఉనికి, భోజన వసతులను ఏర్పాటుచేయుటకు ఆహ్వాన సంఘమువారికి మిక్కిలి కష్టముగా నుండునని యిందుమూలముగా తెలియ పర్చడమైనది.

12. ఆహ్వానసంఘమువారి యొద్ద ఆంధ్రదేశములో దేశీయ భీమాకంపెనీల తరఫున పనిచేయుచున్న ఏజంట్లందరియొక్క చిరునామాలు (Addresses) లేనందున కొంతమందికి ఈ ఆహ్వానముచేరక యుండుటయు కలదు. ఈఆహ్వానము చేరిన ప్రతినిధిసోదరు లందరును, పొరబాటున ఆహ్వానములుచేరని సోదర భీమా ప్రతినిధులను ఆహ్వాన సంఘమువారితరఫున ఆహ్వానించి వెంటతీసికుని రావలసినదిగా కోరుచున్నారు.

(ఆహ్వాన సంఘమువారి అనుమతిని)

ఇట్లు,
డి. రామకృష్ణయ్య
జనరల్ సెక్రటరీ.

గుంటూరు,
15-9-1936.

# The Second Andhra Desa Indian Insurance Agents' Conference, Bezwada.

## 1935 August 17th. & 18th.

### STATEMENT OF RECEIPTS AND PAYMENTS.

| PARTICULARS OF RECEIPTS. | | AMOUNT. | PARTICULARS OF PAYMENTS. | | AMOUNT |
|---|---|---|---|---|---|
| | | Rs. A. P. | | | Rs A. P. |
| To Reception Committee Members Fees | | 55 0 0 | By Provisions, Boarding. Refreshments etc. | | 98 5 0 |
| ,, Delegate Fees | | 68 0 0 | ,, Establishment | | 41 6 0 |
| ,, Donations | Rs. a. p. | | ,, Printing | | 14 8 0 |
| From Companies | 145 0 0 | | ,, President Travelling Charges | | 65 2 0 |
| From private individuals | 14 0 0 | 159 0 0 | ,, Travelling, Conveyance, etc. | Rs. a. p. | |
| ,, Sale proceeds of surplus provisions | | 5 0 0 | Travelling | 29 10 7 | |
| ,, Sundry creditors | | | Conveyance | 14 8 6 | 44 3 1 |
| Details | Rs. a p | | ,, Postage and Telegrams | | 9 4 3 |
| ,, To Services rendered (Press) | 3 8 0 | | ,, Photo Charges | | 5 0 0 |
| ,, Cash advances | 25 5 4 | 28 13 4 | ,, Library | | 6 0 0 |
| | | | ,, Stationary | | 1 7 0 |
| | | | ,, Typists Charges | | 5 0 0 |
| | | | ,, Advertisement Charges | | 10 0 0 |
| | | | ,, Revenue Stamps | | 0 2 0 |
| | | | ,, Due from Mr. P. Subrahmanyam | | 1 12 9 |
| | | | ,, Miscellaneous | | 13 11 3 |
| Total Rs. | | 315 13 4 | Total Rs. | | 315 13 4 |

(Sd.) V. L. SASTRY,
*President, Reception Committee*

(Sd.) S. KANAKARAJU,
*Chief Organiser.*

(Sd.) P. SUBRAHMANYAM,
*General Secretary.*

Sirs, I have examined the above statement of Receipts and Payments of the Reception Committee of the above Conference, held on August 17th and 18th of 1935 at Bezwada with the books, vouchers, and Duplicate Receipts and found it correct. The above statement shows an outstanding liability of Rs. 28-13-4 and the cash on hand is nil. This is in addition to the deficit of Rs. 130-11-0 incurred on the eve of the previous conference

*Camp*: *Bezwada*,
26—9—36.

(Sd.) D. KAMESWARA RAO, B. A., G. D. A., R. A.,
*Registered Accountant.*

# The Third Andhra-desa Indian Insurance Agent's Conference, 1936.

## GUNTUR.

To

ALL THE INDIAN INSURANCE CO'S.

Dear Sirs,

The Third Conference of the Indian Insurance Agents working in the Andhra Desa has been arranged to be held on the 3rd and 4th October 1936, at Guntur. Dr. B. Pattabhi Seetha Ramayya Pantulu garu, B. A, M. B. C. M., the well-known Congress leader and Insurance promoter, has kindly agreed to preside. The main object of the Conference is to carry to the homes of the masses, through an organised army of Insurance Agents, men and women, the need for Insurance and thus spread the message of Insurance in an educative and scientific manner. The Organisors of the Conference recognise that the efforts made by some of the Agents are not yet all that could be desired and therefore propose to take steps to spread the message of Insurance and organise the business in a thoroughly systematic and efficient manner. They further beg to state that the scope of the Conference, though mainly confined to the activities of the Agents, does not exclude the co-operation of the Insurance Companies themselves. The success of the Insurance Gospel in India depends mostly, if not solely, on the support and co-operation extended to the Insurance workers by the pubilc and the Indian Insurance Companies. Consequently we venture to invite your attention not only to the necessity that has prompted us to hold this kind of Conferences but also to the general educative and productive value of this gathering to the Insurance concerns and solicit your valued moral and monetary help for the success and stabilising work of the Conference.

We, the Reception Committee of the Conference, take this opportunity of thanking the many Indian Insurance Companies that have co-operated with us and contributed to the success of our first two Conferences in the year 1932 and 1935.

We make bold to request your heartiest support and valuable financial hely to our institution.

We further request you will be pleased to send on one or more representatives of your Company to attend our Conference and enable us to make it the success it ought to be.

It is requested that all cheques may be sent and remittances made payable to the General Organiser, Mr. S. Kanaka Raju Pantulu, Editor, Bheema Patrica, Bezwada, (S. India).

Support rendered in time is support doubled.

Yours faithfully,

V.V.P. SUBRAHMANYAM, B A., B.L.
*Chairman, R. C.*

N. V. CHELAPATHI RAO,
*Vice-Chairman, R. C.*

S. KANAKARAJU PANTULU,
*General Organiser.*

D. RAMAKRISHNIAH,
*General Secretary.*

Reg. No. M. 2749.



Printed and Published by the Editor at the Andhra Grandhalaya Press, Bezwada.